దోషరహితుఁడు, పిన్నవయసువాఁడు, మంచికర్మలు సేయువాఁడు నగు పుత్రుని కర్మలలో బ్రేరించుము. వర్షోదకము సస్యములఁ బెంపొందించి యన్నముగలిగించునని యింకో అర్థముగలదు.

౭౮౫. మనో నయో॒ధ్వనః స॒ద్య ఏత్యేకః స॒త్రా సూరో॒ వస్వ ఈశే ।
రాజానా మి॒త్రావరుణా సుపా॒ణీ గోషు ప్రి॒య మ॒మృతం॒ రక్షమాణా॥

దం॥ ఏసూర్యుఁడొక్కఁడే (దివ్య) మార్గములను శీఘ్రముగా ననుసరించును, గమనించును. కనుకనే ఆసూర్యుఁడు ధనమునంతయు నొక్కమారే తీసికొనును. ప్రకాశించునట్టి, శోభన బాహువులుకలట్టి, మిత్రావరుణులు (మా) గోవులందు బ్రియమై యమృతమువంటి పాలను రక్షించువారై యున్నారు.

౭౮౬. మానో అగ్నే స॒ఖ్యా పి॒త్ర్యాణి ప్రమర్షిష్ఠా అ॒భి వి॒దుష్క॒విః సన్ ।
నభో॒ న రూ॒పం జ॒రిమా మినాతి పు॒రా తస్యా అ॒భిశ॒స్తే రధీహి॥

దం॥ ఓ యగ్నీ! పిత్ర్యమయిన మా సఖ్యములు పాడుచేయకుము. ఏమంటే నీవు కవివై నీకభిముఖముగా సర్వమును దెలియుదువు. అంతరిక్షమును సూర్యకిరణములు ఆవరించినట్లు ముదిమి నన్నావరించి బాధించుచున్నది. హింసాహేతువయిన యా ముదిమిని నీవు ముందుగానే తెలిసికొనుము. (అమృతత్వమునిమ్మని తా॥)

——:00:——

సూక్తము. ౭౨.

(ఋషి - శక్తిపుత్రుఁడగు పరాశరుఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - త్రిష్టుప్)

౭౮౭. నికావ్యా వే॒ధసః శశ్వ॑త స్క॒ర్హస్తే దధా॒నో నర్యా పు॒రూణి ।
అగ్నిర్భువ ద్రయిపతీ రయీ॒ణాం స॒త్రా చ॒క్రాణో అ॒మృతా॒ని విశ్వా॥

దం॥ శాశ్వతమయిన బ్రహ్మయొక్క కార్యములను (అనఁగా మంత్రములు) ఈయగ్ని మనుష్యులకుఁ బనికివచ్చిన బహుధనములను హస్తమందు ధరించుచున్నదై; అభిముఖ

ముగాఁ జేసికొనుచున్నది, ఈయగ్ని సమస్తధనములను ఒక్కమాఱుగానే చేయుచు నుత్తమధనముల కధికారియై యున్నాఁడు.

౭౮౮. అస్మే వత్సం పరిషన్తం నవిన్దన్నిచ్ఛన్తో విశ్వే అమృతా అమూరాః ।
శ్రమయువః పదవ్యో ధియంధాస్తస్థుః పదేపరమే చార్వగ్నేః॥

దం॥ మాకుఁ బుత్రునివలెఁ బ్రియమైనట్టి; అంతటను వర్తించునట్టి; అగ్నిని దేవతలందఱును మూఢులుకాని (మరుత్తులు) పట్టుకొనలేకపోయిరి. వారు అలసినవారై కాలినడకతో నగ్నిజాడలు కనుక్కొనుచు సుందరమైన, యుత్తమమయిన యగ్ని యున్నచోట నుండిరి.

౭౮౯. తిస్రో యదగ్నే శరదస్త్వామిచ్ఛుచిం ఘృతేన శుచయః సపర్యాన్ ।
నామాని చిద్దధిరే యజ్ఞియాన్యసూదయన్త తన్వః సుజాతాః॥

దం॥ పవిత్రతగల (మరుత్తులు) ఓయగ్నీ! పవిత్రుఁడవైన నిన్నుగూర్చియే మూఁడుసంవత్సరములు నేతితో నెపుడు పూజించిరో యపుడు (నీవుప్పుట్టితివి.) వారు యజ్ఞార్హమైన నామములనుగూడ ధరించిరి. తరువాతఁ బ్రొత్తగాఁ బుట్టినవారై (నిన్నుకలిసిన తరువాత తమరూపము మారినవారని తా॥) తమశరీరములను స్వర్గముఁబొందించిరి.

౭౯౦. ఆరోదసీ బృహతీ వేవిదానాః ప్రరుద్రియా జభ్రిరే యజ్ఞియాసః ।
విదన్మర్తో నేమధితా చికిత్వానగ్నిం పదే పరమే తస్థివాంసమ్॥

దం॥ విశాలమయిన ద్యావాపృథువులకు నొకరితో నొకరికిఁ జెప్పుచు యజ్ఞార్హులయిన దేవతలు రుద్రునకర్హములయిన (స్తుతులు) చేసిరి. (రుద్రపదమిచట నగ్నికే చెల్లును.) సగభాగమును దీసికొనునట్టి (యింద్రునితోఁ గలిసి మరుత్తులగణము ఉత్తమస్థానమందు (అనఁగా నశ్వత్థవృక్షమందని తా॥) ఉన్నటువంటి యాయగ్నిని తెలిసికొని చేరెను. (ఆహుతిలో సగమింద్రుఁడు తీసికొనును. తక్కిన దేవతలు మిగిలినసగము పంచుకొందురట.)

౯౧. సంజానానా ఉపసీద న్నభిజ్ఞు పత్నీవన్తో నమస్యం నమస్యన్ ।

రిరిక్వాంస స్తన్వః కృణ్వత స్వాః సఖా సఖ్యుర్నిమిషి రక్షమాణాః॥

ద॥ ఓ యగ్నీ ! నిన్ను జక్కగాఁ దెలిసికొన్న దేవతలు సమీపించుచున్నారు. (సమీపించి) భార్యలతోఁగూడినవారై నమస్కారార్హుఁడును, ఎదురుగాఁ గాళ్ళు ముడిచికొని కూర్చున్నవాఁడును అగు నిన్ను అభిముఖముగా బూజించిరి. (పూజించి) సఖుఁడవయిన (నీ) దర్శనముఃలిగినందున (నీచే) రక్షింపబడినవారై నీనేస్తులు (అనగా దేవతలు) తమశరీరములను (వ్రతదీక్షతో) ఎండింపఁజేయుచు యాగము సేసిరి.

౯౨. త్రిస్సప్త యద్గుహ్యాని త్వే ఇత్పదా విదన్నిహితా యజ్ఞియాసః ।

తేభిరక్షన్తే అమృతం సజోషాః పశూంశ్చ స్థాత్యాంచరథంచపాహి॥

ద॥ ఇరువదియొక్క రహస్యములు ఏవిగలవో యా యజ్ఞమును (పాకయజ్ఞయు లేదు, హావిర్యాగము లేదు, సోమయాగము లేదు మొత్తము ఇరువదియొకటి యని తా॥) ఓ యగ్నీ! నీయందే యుంచఁబడినవి. యజమానులు ఆయాగములనుబొందిరి. (పొంది) ఆయజ్ఞములతో అమృతుఁడవయిన నిన్ను రక్షించుకొనుచున్నారు. యజమానులతో సమానప్రీతిగల నీవు వారిపశువులను స్థిర (=చెట్లు, సస్యములు) జాతులను తదితరచరములను (బిడ్డలు, నౌకరులు) రక్షింపుము.

౯౩. విద్వాఁ అగ్నే వయునాని క్షితీనాం వ్యానుషక్ శురుధో జీవసేధాః ।

అన్తర్విద్వాఁ అధ్వనో దేవయానా నతన్ద్రో దూతో అభవో హవిర్వాట్॥

న॥ ఓ యగ్నీ ! తెలియవలసినవన్నియుఁ దెలిసికొనుచు నీవు జనులజీవనముకొరకు నన్నములను ఎడఁదెగకుండునట్లు చేయుము. యజమానులిచ్చిన హవిస్సులను మోయుచు దూతవయితివి. నీవు ద్యావాపృథివీ మధ్యభాగమునందలి యన్ని దేవ మార్గములను తెలిసినవాఁడవు. అలసత లేనివాఁడవును.

౯౪. స్వాధ్యో దివ ఆసప్త యహ్వీ రాయోదురోవ్యృతజ్ఞా అజానన్ ।

విదద్గవ్యం సరమా దృళ్హ మూర్వం యేనానుకం మానుషీభోజతే విట్॥

వం॥ మంచికార్యములు సేయుచుండి, యేడు గొప్పనదులు ద్యులోకమునుండి వచ్చి (భూమియందుఁ బ్రవహించుచున్నవి. యజ్ఞమెఱింగిన (అంగిరసులు) ధనమువచ్చు మార్గములను నీవల్ల దెలిసికొనిరి. ఏ పాలతో మానవులు భుజింతురో ఆ గోవులవల్ల బుట్టిన అధికమయిన పాలను దేవశుని (దేవతలు పెంచిన ఆడుకుక్క) పొందెను.

౭౯౫. ఆయేవిశ్వా స్వపత్యాని తస్థుః కృణ్వానాసో అమృతత్వాయ గాతుమ్ ।

మహ్నామహద్భిః పృథివీ వితస్థే మాతాపుత్రైరదితిర్ధాయసే వేః ॥

వం॥ ఏ యాదిత్యు లమృతత్వముకొఱకు నుపాయములు చేయుచున్నవారై పతనము లేని (అనఁగా విఘ్నము లేని) సకల కర్మలను జేసిరో ఆ గొప్ప కుమారులచేత నుత్సహించుచున్న వారితల్లియగు పృథివి సర్వజగత్తులు ధరించుటకు దనమహిమచే సమర్థురాలయ్యెను. (దేవతలందఱు పృథివి పుత్రులట!) ఓయగ్నీ! నీవు (ఆదిత్యులిచ్చిన చరుపురోడాశములను) భక్షించితివి. (అందుచేతనే యిది కలిగెనని తా॥)

౭౯౬. అధిశ్రియం నిదధు శ్చారుమస్మిన్ దివోయదక్షీ అమృతా అకృణ్వన్ ।

అధక్షరన్తి సింధవో నసృష్టాః ప్రనీచీ రగ్నే అరుషీరజానన్ ॥

వం॥ ఈ యగ్నియందు శోభనమగు యజ్ఞసంపదను (పశ్వాలు పసుచుట మొదలగు పరిచర్య) యజమానులొనర్చిరి. (ఎపుడు) రెండు నేత్రములను యాగమున నిర్మించిరో (రెండు ఆజ్యాహుతులు అగ్నిలో వేతురు. అవి అగ్ని రెండు నేత్రములను భావించి వేతురు) అపుడు దేవతలు ద్యులోకమునుండి వెంటనే వత్తురు. ఆతరువాతనే అగ్ని జ్వాలలు నదులవలె శీఘ్రగమనము కలిగినవై యన్నిదిక్కుల వ్యాపించుచున్నవై వెలుంగుచు సంచలించును. దానిని దేవతలు తెలిసికొనుచున్నారు.

---

## సూక్తము ౭౩.

(ఋషి - పరాశరుఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - త్రిష్టుప్.)

౭౯౭. రయిర్నయః పితృవిత్తో వయోధాః సుప్రణీతి శ్చికితుషో నశాసుః ।

స్యోనశీ రతిథిర్న ప్రీణానో హోతేవసద్మ విధతో వితారీత్ ॥

దం॥ పిత్ర్యమయిన ధనమువలెను ఏయగ్ని అన్నమునిచ్చును. విద్వాంసుని శాసనమువలె సుఖముగాఁ బ్రణయింపఁదగినవాఁడు. (ప్రణయించుట=మండించుట) అతిథివలె శాలలో సుఖముగా శయనించును. ప్రీతిచెందిన యగ్ని యజమానగృహమును హోత (పురోహితుఁడు) వలె వృద్ధినొందించును.

౯౯. దేవో నయః సవితా సత్యమన్మా క్రత్వాని పాతి వృజనాని విశ్వా ।
పురుప్రశస్తో అమతిర్నసత్య ఆత్మేవ శేవో దిధిషాయ్యోభూత్॥

దం॥ సూర్యునివలె నెవఁడు ప్రకాశించుచు యథార్థమును గుర్తెఱింగిన ఏయగ్నితన కర్మచేత సకలయుద్ధములను (ప్రజలకు) దాటించును. బహులుగా స్తుతింపబడిన యగ్ని (పృథివ్యాదుల) స్వరూపమువలె నిత్యుఁడై (ఆకారములు మాఱినను పృథివీత్వ జలత్వాది స్వరూపమొక్కటే యని తా॥ ఉ॥ నూయి, నది, చెఱువు, సముద్రము, సర్వము జలరూపమే, ఆకారము వేఱు) ఆత్మవలె సుఖకరుఁడై ధరింపదగిన వాఁడయ్యెను. (ధరించుట=నిలువచేసుకొని యుంచుటని తా॥)

౯౯. దేవో నయః పృథివీం విశ్వధాయా ఉపక్షేతి హితమిత్రో న రాజా ।
పురః సదః శర్మసతో నవీరా అనవద్యాపతిజుష్టేవనారీ॥

దం॥ సూర్యునివలెనే యగ్ని సర్వమును ధరించును. మేలుకూర్చు మిత్రులుగల రాజువలెఁ బ్రీతినిగలిగించుచు (దేవగృహమందు) ఉండును. ఏ యగ్ని యెదుటఁ గూర్చొన్న యజమాన ఋత్విజులు తండ్రియింటనున్న కొమాగులవలె నుందురో యాయగ్ని పెనిమిటితోఁగూడిన శుద్ధురాలయిన స్త్రీలవలెఁ బవిత్రుఁడగును.

౧౦౦. తంత్వా నరో దమ ఆనిత్యమిద్ధ మగ్నే సచన్త క్షితిషు ధ్రువాసు ।
అధిద్యుమ్నం నిదధు ర్భూర్యస్మిన్భవా విశ్వాయుర్ధరుణో రయీణామ్॥

దం॥ ఓయగ్నీ! ఆనిన్ను యజమానులు గ్రామములందు, యజ్ఞగృహములందును, బ్రజ్వలింపఁజేయుచు నభిముఖముగా సేవింతురు. ఈయగ్నియందు బహువిధానములను (హవిస్సులని తా॥) ఉంచుదురు. అట్టి యగ్నీ! సర్వాన్నములుకలవాఁడవై ధనముల ధరించువాఁడవుకమ్ము.

౨౦౫. అర్వద్భిరగ్నే అర్వతో నృభిర్నౄన్వీరైర్వీరాన్వనుయామా త్వోతాః ।
ఈశానాసః పితృవిత్తస్య రాయో విసూరయః శతహిమానో అశ్యుః॥

దం॥ ఓ యగ్నీ! నీచేత రక్షింపబడినవారమై మేము మా గుఱ్ఱములతో (శత్రువుల) గుఱ్ఱములను మా భటులచేత (శత్రు) భటులను మా వీరులచేతను (వీర్యముచే బుట్టిన వాఁడు=కొడుకని తా॥) శత్రువీరులను జంపుదుము. మా కొడుకులు పిత్ర్యధనముల కధిపతులగుచు విద్యావంతులయి నూరేండ్లు జీవింతురుగాక.

౨౦౬. ఏతా తే అగ్న ఉచథాని వేధో జుష్టాని సన్తుమనసే హృదేచ ।
శకేమరాయః సుధురోయమం తేऽధిశ్రవో దేవభక్తం దధానాః॥

దం॥ మేధావంతుఁడవగు నో యగ్నీ! ఇపుడు మేముచేసిన స్తుతులు నీ మనసునకు హృదయమునకు ప్రియములగుగాక. నీలోని ఆజ్యాది హవిస్సులను దేవతలకిచ్చుచు నీసంబంధమయిన మంచి యుపయోగకరమైన ధనములను నియమించుటకు శక్తుల మగుదుముగాక. (నీధనము మా యాధీనములోనుండుఁగాకని తా॥)

ఇట్లు పండ్రెండవ యనువాకము శ్రీ శ్రీ శ్రీ

—:-o-:—

అనువాకము. ౧౩.

సూక్తము. ౭౪.

(ఋషి - రహూగణపుత్రుఁడగు గౌతముఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - గాయత్రి)

౨౦౭. ఉపప్రయన్తో అధ్వరం మన్త్రం వోచేమాగ్నయే । ఆరే అస్మే చ శృణ్వతే॥

దం॥ హింసాదోషములేని యజ్ఞములను (అధ్వర=హింసలేని) చేయుచున్న మేము దూరముగానుండి వినుచున్న అగ్నిదేవునికొఱకు (స్తుతి) మంత్రములను పఠించుచున్నాము.

౨౦౮. యః స్నీహితీషు పూర్వ్యః సంజగ్మానాసు కృష్టిషు । అరక్షద్దాశుషే గయమ్॥

వ౦॥ చాలకాలమునాటి యేయగ్ని చంపవలచి కుట్రలుపన్ను శత్రులుండఁగాఁ గూడ యజమానునకు ధనము వర్షించునో యట్టి మంత్రమును బఠింతుము. (అని ఋత్విజుల మాట)

౮౦౯. ఉత బ్రువన్తు జన్తవ ఉదగ్ని ర్వృత్రహాజని । ధనంజయో రణేరణే॥

ద౦॥ (నీటి నావరించి మూఁతవేసిన) వృత్రుని సంహరించునట్టి, ప్రతియుద్ధమందు ధనములను సంపాదించునట్టి అగ్ని పుట్టినది. ఆతరువాతఁ బుట్టినజంతువులు అగ్నిని స్తుతించుచున్నారు.

౮౧౦. యస్య దూతో అసిక్షయే వేషి హవ్యాని వీతయే। దస్మత్కృణో ష్యధ్వరమ్॥

ద౦॥ ఓ యగ్నీ! ఏ యజమానునింట నీవు దేవతల దూతవయితివో ఎవని హవ్యములను (చరుపురోడాశాది హవిస్సులు) భక్షించుటకై (దేవతలకుఁ) గొనిపోవుచున్నావో ఎవని యధ్వరమును (హింసలేనియాగము) చూడఁదగినవానిగాఁ జేయుచున్నావో.

౮౧౧. తమిత్సు హవ్య మఙ్గిరః సుదేవం సహసోయహో। జనా ఆహుః సుబర్హిషమ్॥

ద౦॥ బలమువల్ల బుట్టినవాఁడా! (మథించుటచేఁ బుట్టెనని తా॥) అంగిరుఁడా! (=రమ్యకాంతిగలవాఁడు) (మీఁద వివరించిన) ఆయజమానుని శోభన హవిస్సులు కలవానిగాను, శోభనదేవతలు కలవానిగాను, శోభనయజ్ఞము కలవానిఁగాను జనులు చెప్పుచున్నారు.

౮౧౨. ఆచవహాసి తాఁఇహ దేవాఁ ఉపప్రశస్తయే। హవ్యాసు శ్చన్ద్ర వీతయే॥

ద౦॥ మంచి యాహ్లాదమును గలిగించు నగ్నీ! ఆ దేవతల నీయజ్ఞముచోటికి మేము స్తుతించుటకుఁగాఁ దీసికొనిరమ్ము. (వారి) భక్షణముకొఱకు హవ్యములను ఇమ్ము.

౮౧౩. నయో రుపబ్ది రశ్వ్యః శృణ్వే రథస్య కచ్చన। యదగ్నే యాసిదూత్యమ్॥

దం॥ ఓ యగ్నీ! ఏ రథము [illegible] అశ్వములు [illegible] సంచరించుచుండగా నిక్కడ [illegible] పుట్టిన [illegible] (ధ్వని) వినఁబడలేదు. (గమనము శీఘ్రమగుటచే ధ్వని [illegible] తా॥)

౭౪.౮. త్వోతో వాజ్యహ్రయోఽభి పూర్వస్మాదపరః । ప్రదాశ్వాఀ అగ్నే అస్థాత్॥

దం॥ ఏపురుషుఁడు హవిస్సుల నిచ్చునో యతఁడు ఓ యగ్నీ! యిపుడు నీకు హవిస్సులనిచ్చుచు నిచే సంరక్షింపఁబడి అన్నము కలిగి లజ్జలేనివాఁడై (ఐశ్వర్యములు లేనిచో [illegible] తా॥) ప్రతిష్ఠావంతుఁడగుచున్నాఁడు.

౭౪.౯. ఉత ద్యుమత్సువీర్యం బృహదగ్నే వివాససి । దేవేభ్యో దేవ దాశుషే॥

దం॥ మఱియు నో యగ్నిదేవా! దేవతలకొఱకు (హవిస్సుల నిచ్చువానికి) ప్రశస్త వీర్యము గల్గి దీప్తిమంతమగు గొప్ప ధనమును ఇచ్చుచున్నావు.

—:-O-:—

సూక్తము. ౭౫.

(ఋషి - రహూగణపుత్రుఁడగు గోతముఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - గాయత్రి)

౭౫.౧. జుషస్వ సప్రథస్తమం వచో దేవప్సరస్తమమ్ । హవ్యా జుహ్వాన ఆసని॥

దం॥ నీనోటను హవిస్సులను హోమముచేయుచు నో యగ్నీ! బహువిస్తృతమయిన వాక్కులను, దేవతలను ప్రీతినొందించునట్టి దానిని సేవింపుము.

౭౫.౨. అథా తే అఙ్గిరస్తమాగ్నే వేధస్తమ ప్రియమ్ । వోచేమ బ్రహ్మ సానసి॥

దం॥ మిక్కిలి ప్రకాశించువాఁడా! అగ్నీ! మేధాశాలీ! తరువాత నీ కొఱకుఁ బొందఁదగిన ప్రీతికరమయిన స్తోత్రమును మేము పఠింతుము.

౭౫.౩. కస్తే జామిర్జనానామగ్నే కో దాశ్వధ్వరః । కో హ కస్మిన్నసి శ్రితః॥

దం॥ ఓ యగ్నీ! జనులలో నెవరు నీబంధువు? నీకెవఁడు యాగమునిచ్చును? నీవెవఁడవు? ఏచోటు నాశ్రయించియుంటివి? (అనగా నీ సమానుఁడు లేఁడు. నీకు తగిన యజ్ఞము చేయలేదు. నీ వెచటనుండువో యెఱుఁగరని తా॥)

౮౧౯. త్వం జామిర్జనానామగ్నే మిత్రో అసి ప్రియః । సఖా సఖిభ్య ఈడ్యః ।

వ॥ ఓ యగ్నే! నీవు జనులకు బంధుడవు, ప్రియమిత్రుడవు, స్తుతింపదగిన వాఁడవు. సఖులయిన (ఋత్విజులకు) సఖుడవగుచున్నావు (ఋత్విజుల పేర్లును, అగ్ని పేర్లును సమానములు కనుక మిత్రులని తా॥)

౮౨౦. యజా నో మిత్రావరుణా యజా దేవాఁ ఋతం బృహత్ । అగ్నే యక్షి స్వం దమమ్ ।

వ॥ ఓ యగ్నే! మిత్రావరుణులను మా నిమిత్తము యజింపుము. ఆట్లే దేవతలను యజింపుము. యజ్ఞము నొనరింపుము. గొప్పదగు నీ యాగగృహమునందు ఉండుము.

---

సూక్తము. ౭౬.

(ఋషి - రహూగణపుత్రుఁడగు గౌతముఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - త్రిష్టుప్.)

౮౨౧. కా త ఉపేతిర్మనసో వరాయ భువదగ్నే శంతమా కా మనీషా ।

కో వా యజ్ఞైః పరి దక్షం త ఆప కేన వా తే మనసా దాశేమ ।

వ॥ ఓ యగ్నే! నీమనస్సు మాయందు నిలుపుకొనుటకు మాకేమి యుపాయము కలదు? నీమనస్సును సంతోషపెట్టు స్తుతియెట్టిది? యజ్ఞములతో నెవడు నీబలము పొందదగును? ఏ బుద్ధితో నీకు హవిస్సుల నిత్తుము? (ఇవేవియు మాకు శక్యములు కావని తా॥)

౮౨౨. ఏహ్యగ్న ఇహ హోతా ని షీదాదబ్ధః సు పురఏతా భవా నః ।

అవతాం త్వా రోదసీ విశ్వమిన్వే యజా మహే సౌమనసాయ దేవాన్ ॥

వ॥ ఓ యగ్నే! రమ్ము ఈయజ్ఞమందు దేవతలంబిలుచువాఁడవై కూర్చుండుము. మాయందు నడుచువాఁడవుకమ్ము. నీవు (రాక్షసులకు) లొంగవు కనుక అట్టినిన్ను సర్వవ్యాపులగు ద్యావాపృథువులు రక్షించునుగాక. తరువాత (మామీఁద) మంచి యభిప్రాయము కలుగుటకు దేవతలను బూజింపుము.

౮-౨౩. ప్రసు విశ్వాన్రక్షసో ధక్ష్యగ్నే భవాయజ్ఞానామభి శస్తిపావా ।

అథావహసోమ పతిం హరిభ్యామాతిథ్య మస్మైచక్రుమాసుదావ్నే॥

ద॥ ఓ యగ్నీ ! సర్వరాక్షసులను గట్టిగాదహించుము. మేముచేయు యాగముల నుపద్రవములనుండి రక్షించువాడవు కమ్ము. తరువాత సోమముల బాలించునతని (అనగా నింద్రుని) రెండుగుఱ్ఱములతోఁ దీసికొనిరమ్ము. శోభనఫలమునిచ్చు నా యింద్రునకు అతిథిసత్కారము చేయుదుము.

౮-౨౪. ప్రజావతా వచసా వహ్నిరాసా చహువే నిచసత్సీహదేవైః ।

వేషి హోత్రముత పోత్రం యజత్ర బోధిప్రయన్తర్జనితర్వసూనామ్॥

ద॥ సంతానమును గలుగఁజేయు స్తుతిమంత్రముతో (స్తుతింపబడిన) యే యగ్ని తన నోరుగానున్న మంటతో దేవతలకు హవిస్సులం గొనిపోవునో ఆ యగ్నిని యాహ్వానించుచున్నాను. ఈ కర్మయందగ్నీ ! నీవు దేవతలతోఁగూడి కూర్చుండుము. పూజ్యుఁడవయిన యగ్నీ ! హోతచేయు కర్మను మఱియు పోత (ఋత్విజులలోనొకడు) చేయు కర్మను గోరుము. ధనములనిచ్చుచు సర్వమును గలుగజేయు నగ్నీ ! మమ్ము బోధించుము

౮-౨౫. యథా విప్రస్య మనుషో హవిర్భిర్దేవా అయజః కవిర్భిః కవిఃసన్ ।

ఏవాహోతః సత్యతరత్వమద్యాగ్నే మన్ద్రయా జుహ్వా యజస్వ॥

ద॥ కవిసైవై (గతించినదాని నెఱిఁగినవాడని వ్యు॥) మేధావంతులగు ఋత్విజులతో గూడ మేధావియయిన మనువుయొక్క హవిస్సులతో నెట్లు దేవతలను యజించితివో అట్లే హోమకర్తవును మిగుల సత్యవంతుడవును అగు నగ్నీ ! నీవీయజ్ఞమందు హర్షమును గలిగించు జుహువుతో (హోమసాధనము, గరిటెవంటిది) దేవతలను యజింపుము.

—:-o-:—

సూ క్త ము, ౭౭.

(ఋషి - రహూగణపుత్రుఁడగు గౌతముఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - త్రిష్టుప్.)

౮౨౬. కథా దాశేమాగ్నయే కాస్మై దేవజుష్టోచ్యతే భామినే గీః।

యోమర్త్యేష్వమృత ఋతావా హోతా యజిష్ఠ ఇత్కృణోతి దేవాన్॥

తా॥ ఈయగ్నికి (హవిస్సు) నెట్లిత్తుము? తేజోవంతుఁడయినయగ్నికొఱకు దేవతలు సేవింపఁదగిన మంత్రమెట్టిది పఠింపవలెనో? మరణరహితుఁడును, సత్యవంతుఁడును, దేవదూతయు, యజ్ఞకర్తయు నగు నగ్నియే మరణధర్మముగల మానుషులయందుండి దేవతలకు హవిస్సులనిచ్చును.

౮౨౭. యో అధ్వరేషు శన్తమ ఋతావా హోతా తమూ నమోభిరాకృణుధ్వమ్।

అగ్నిర్యద్వేర్మర్తాయ దేవాన్త్సచా బోధాతి మనసా యజాతి॥

తా॥ ఏ యగ్ని యజ్ఞములందు మిక్కిలి సుఖము గలిగించునో యథార్థము నెఱింగినవాఁడు, దేవతల నాహ్వానించువాఁడు నెవ్వఁడగుచున్నాఁడో యా యగ్నినే (ఓ ఋత్విగ్యజమానులారా) మీరు స్తుతులచేత నభిముఖునిగాఁ జేయుఁడు. ఈ యగ్ని యజమానునినిమిత్తము దేవతలవద్దకుఁబోవునప్పుడు, అతఁడే దేవతలను బోధించును.

౮౨౮. సహి క్రతుః సమర్యః ససాధు ర్మిత్రోన భూదద్భుతస్యరథీః।

తంమేధేషు ప్రథమం దేవయన్తీర్విశ ఉపబ్రువతే దస్మమారీః॥

తా॥ ఆయగ్నియే కర్మలుచేయువాఁడు, అతఁడే (ప్రపంచము) నాశమొందించువాఁడు, అతఁడే పుట్టించువాఁడు, లేనిధనమును, మిత్రుఁడు దెచ్చియిచ్చునట్లు తెచ్చియిచ్చును. యాగములందు దేవతలను గోరుచున్న ప్రజలు దర్శనీయుఁడయిన యా యగ్నిని సేవించుచు నతనినే ప్రధానునిగాఁ జెప్పుదురు.

౮౨౯. సనో నృణాం నృతమో రిశాదా అగ్నిర్గిరోవసా వేతుధీతిమ్।

తనాచ యేమఘవానః శవిష్ఠా వాజప్రసూతా ఇషయన్తమన్మ॥

తం॥ యజ్ఞమునడుపువారిలో నాయకశ్రేష్ఠుడును, శత్రువులందరిని జయించువాడును అగు నాయగ్ని మా స్తవములను, (హవీరూపములగు) నన్నములతోఁగూడిన కర్మములను, గోరుచుఁగాక. ఏయజమానులు విస్తారమగు ధనముతో ధనికులగుచున్నారో, బలవంతులు నగుచున్నారో, హవిస్సులనిచ్చువారో, వారు స్తుతులఁజేయించుచున్నారు. (ఋత్విజులచేతనని తా॥)

౮౦. ఏవాగ్నిర్గోతమేభి ర్ఋతావా విప్రేభి రస్తోష్ట జాతవేదాః।

సఏషు ద్యుమ్నం పీపయత్సవాజం సపుష్టింయాతి జోషమాచికిత్వాన్॥

తం॥ యజ్ఞముగల జాతవేదుఁడు (=అగ్ని, ధనము, లోక, కలవాఁడని వ్యుత్పత్తి) మేధావంతులయిన గోతము ఋషులచే స్తుతింపఁబడెను. ఆయగ్ని యీ గోతములకు ప్రకాశించునన్న చక్కని (సోమమును) పానముచేసెను. అన్నములను (=హవిస్సులను) భక్షించెను. మాసేవనెఱిఁగి యీ యగ్ని పుష్టినొందెను.

---

## సూక్తము. ౭౮.

(ఋషి - రహూగణపుత్రుఁడగు గోతముఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - గాయత్రి.)

౮౧. అభిత్వా గోతమాగిరా జాతవేదో విచర్షణే। ద్యుమ్నైరభి ప్రణోనుమః॥

తం॥ ఓ యగ్నీ! సర్వమునెఱిఁగినవాఁడా! గోతములు స్తుతిరూపమైన వాక్కులతో నిన్ను అభిముఖమగునట్లు స్తుతించిరి. మేముకూడ నీగుణములఁ బ్రకటించు మంత్రములతో స్తుతింతుము.

౮౨. తముత్వాగోతమోగిరా రాయస్కామోదువస్యతి। ద్యుమ్నైరభి ప్రణోనుమః॥

తం॥ ధనకాముఁడైన గోతముఁడు స్తుతివాక్కులతో సేవించిన యగ్నినే స్తుతిమంత్రములతో మేము స్తుతింతుము.

౮౩. తముత్వా వాజసాతమ మఙ్గిరస్వ ద్ధవామహే। ద్యుమ్నై రభిప్రణోనుమః॥

వ॥ అగ్నీ ! అన్నముల విశేషముగానిచ్చు నిన్ను అంగిరస్సివలె స్తుతిమంత్రము లతోఁ బిలుతుము. స్తుతింతుము కూడను.

౮౩౪. తము త్వా వృత్రహన్తమం యో దస్యూఁరవధూనుషే। ద్యుమ్నైరభి ప్రణోనుమః॥

వ॥ ఓ యగ్నీ ! దస్యులను (=నాశకులని భావము) నీవు కూలఁద్రొబ్బుచున్నావు. వృత్రుని హంతవగు నిన్ను స్తుతిమంత్రములతో నుతింతుము. (ద్యుమ్నైః [illegible] మని సాయనార్థము.)

౮౩౫. అవోచామ రహూగణా అగ్నయే మధుమద్వచః। ద్యుమ్నైరభి ప్రణోనుమః॥

వ॥ రహూగణుని కొమారులమయిన మేము (=గోతముడే) అగ్నిదేవునికొఱకు మధురమైన స్తుతులను బఠించితిమి. స్తుతిమంత్రములతో నన్ని నాటికిని స్తుతించుచున్నాము.

---

## సూక్తము. ౭౯.

(ఋషి - రహూగణ పుత్రుఁడగు గోతముఁడు: దేవత - ౧, ౨, ౩, మాధ్యమాగ్ని: ౪-౬. కేవలాగ్ని: ఛందస్సు ౧-౩. త్రిష్టుప్, ౪, ౫, ౬, ఉష్ణిక్, శేషించినవి. గాయత్రి)

౮౩౬. హిరణ్యకేశో రజసో విసారేఽహిర్ధునిర్వాతఇవ ధ్రజీమాన్।
శుచిభ్రాజా ఉషసో నవేదా యశస్వతీరపస్యువో నసత్యాః॥

వ॥ బంగారువంటి (జ్వాలారూప) కేశములుగలవాఁడు, సమీపించితే బాధించువాఁడు, మేఘములను గదలించువాఁడు, వాయువువలె శీఘ్రగమనముగలవాఁడు, నగు నగ్నిని (అనఁగా మెఱుపు) ఉదకములను వర్షించుటకు తెలియున్నవి మెఱయుచు నన్నములతో సఫలకర్మలు సేయఁగోరిన ప్రజలెఱింగినట్లు ఉషస్సులెఱుఁగవు.

౮౩౭. ఆ తే సుపర్ణా అమినన్త ఏవైః కృష్ణో నోనావ వృషభో యదీదమ్।
శివాభిర్న స్మయమానాభిరాగాత్పతన్తి మిహః స్తనయన్త్యభ్రా॥

వ॥ ఓ యగ్నీ ! మంచిప్రసారముగల మీకిరణములు గమనస్వభావముగల మరుత్తు లతోఁగూడ (మేఘమును) గొట్టును కొట్టగానే కృష్ణమేఘము ధ్వనించును. ఈ లాంటిపని జరిగినపుడు శుభ్రమయిన నవ్వుకాంతులవలె మెఱయు మెఱుపులతోఁ గూడ వర్షమేఘము బయలుదేరును. ఉదకములు కురియును. నీటిమేఘము ధ్వనించును.

౭౩౭. యదీమృతస్య పయసా పియానో నయన్నృతస్య పథిభీ రజిష్ఠైః ।
అర్యమా మిత్రో వరుణః పరిజ్మా త్వచంపృఞ్చ న్త్యుపరస్య యోనౌ॥

వ॥ ఎపుడు ఈయగ్ని ఉదకముయొక్క పాలవంటి సారమగు రసముతో (జగత్తును) తృప్తిపఱచునో, ఎపుడు తిన్ననిదారిని వర్షముకురిపించునో యపుడు అర్యముఁడు మిత్రుఁడు, వరుణుఁడును, మరుత్తులును, మేఘముయొక్క ఉత్పత్తి స్థానమందున చర్మమును జీల్చుదురు.

౭౩౯. అగ్నే వాజస్య గోమత ఈశానః సహసో యహో ।
అస్మే ధేహి జాతవేదో మహి శ్రవః॥

వ॥ బలముయొక్క పుత్రుఁడవయిన యోయగ్నీ ! బహుగోవులతోఁగూడిన యన్నమునకు నీ వీశ్వరుఁడవయియున్నావు. కనుక మాయందు ఓ జాతవేదా ! (=పుట్టిన సర్వము లెఱింగిన) విశేషధనమును గలుగఁజేయుమా.

౭౪౦. సఇధానో వసుష్కవి రగ్ని రీళేన్యో గిరా । రేవ దస్మభ్యం పుర్వణీక దీదిహి॥

వ॥ ఆ యగ్ని ప్రకాశించువాఁడును, నివాసమునకు హేతువును (అగ్ని లేకుండఁగా కాపురమే చేయలేరని తా॥) బుద్ధిమంతుఁడునులయి స్తుతిమంత్రములతోఁగొనియాడఁదగి యున్నాఁడు. జ్వాలారూపమగు బహుముఖములవాఁడా ! ధనముతోఁగూడిన యన్నము మాకుఁగలుగునట్లు ప్రకాశించుము.

౭౪౧. క్షపో రాజన్నుత త్మనాగ్నే వస్తో రుతోషసః । సతిగ్మ జమ్భ రక్షసో దహ ప్రతి॥

వ॥ అన్నిదినములందు నన్నిరాత్రులందు నోయగ్నీ ! రాక్షసులను స్వయముగా సంహరింపుము. తీక్ష్ణముఖముగలవాఁడా ! ఒకరినైన వదలకుండ రాక్షసులను దహింపుము.

౨౮౨. అవా నో అగ్న ఊతిభిర్గాయత్రస్య ప్రభర్మణి । విశ్వాసు ధీషు వంద్య ॥

తా॥ సర్వకర్మలందును, స్తుతింపదగిన యగ్నీ! గాయత్రీఛందముగల సామమంత్ర పాఠము గలుగునప్పుడు నీరక్షలతో మమ్ముఁ గాపాడుము.

౨౮౩. ఆ నో అగ్నే రయిం భర సత్రాసాహం వరేణ్యమ్ । విశ్వాసు పృత్సు దుష్టరమ్ ॥

తా॥ ఓ యగ్నీ! ఒక్కమారుగా దారిద్ర్యము నణఁచునట్టి, అందఱును కోరదగినట్టి, సర్వయుద్ధములందును శత్రువులకు లొంగని ధనము నిమ్ము.

౨౮౪. ఆ నో అగ్నే సుచేతునా రయిం విశ్వాయుపోషసమ్ । మార్డీకం ధేహి జీవసే ॥

తా॥ ఓ యగ్నీ! సుఖమును గలిగించునట్టి, బ్రతికియున్నన్నాళ్ళు దేహములను బోషించునట్టి, మంచిజ్ఞానముతోఁ గూడిన ధనమును మాజీవనముకొఱకు నిమ్ము.

౨౮౫. ప్ర పూతాస్తిగ్మశోచిషే వాచో గోతమాగ్నయే । భరస్వ సుమ్నయుర్గిరః ॥

తా॥ ఓ గోతమర్షీ! ధనముకావలెనని కోరిన నీవు తీక్ష్ణజ్వాలలుగల యగ్నికి నిర్మలమైన పవిత్రవర్ణనలుగల స్తుతులను సమర్పింపుము.

౨౮౬. యో నో అగ్నేఽభిదాసత్యన్తి దూరే పదీష్ట సః । అస్మాకమిద్వృధే భవ ॥

తా॥ ఓ గోతమర్షీ! మమ్ము సమీపమునందుగాని దూరమునందుగాని ఏశత్రువు బాధించునో అతఁడు నశించుగాక!

౨౮౭. సహస్రాక్షో విచర్షణిరగ్నీ రక్షాంసి సేధతి । హోతా గృణీత ఉక్థ్యః ॥

తా॥ అసంఖ్యాక జ్వాలలనెడు కన్నులు గలవాఁడై సర్వమును జూచునట్టి యీ యగ్ని రక్కసులను (యాగస్థలమునందుండి తోలివేయును) ఈ యగ్ని సామమంత్రములతో స్తుతింపబడినవాఁడై దేవతలందఱిలోను హోతయగుచు (వారిని) స్తుతించును.

—:-o-:—

## సూ క్త ము ౮౦.

(ఋషి - గౌతముఁడు ; దేవత - ఇంద్రుఁడు ; ఛందస్సు - పఙ్క్తి.)

౮౭౮. ఇత్థాహిసోమ ఇన్మదే బ్రహ్మా చకారవర్ధనమ్ ।
శవిష్ఠవజ్రి న్నోజసా పృథివ్యా నిఃశశా అహిమర్చన్ననుస్వరాజ్యమ్॥

దం॥ మిక్కిలి బలవంతుఁడవగు వజ్రహస్తుఁడా! (ఇంద్రా) ఈవిధముగా మదముఁ గలిగించు సోమమును (నీవు త్రాగగా) నీకు వృద్ధిని గలిగించు స్తుతిని బ్రహ్మయును ఋత్విజుఁడును సేయుచున్నారు. కనుకనే నీరాజ్యమును బ్రకటించుకొనుచు బలము చేత భూమినుండి వృత్రునిఁ బూర్తిగా శాసించితివి.

౮౭౯. సత్వా మదద్వృషా మదఃసోమః శ్యేనాభృతః సుతః ।
యేనా వృత్రం నిరద్భ్యో జఘన్థ వజ్రి న్నోజసార్చన్ననుస్వరాజ్యమ్॥

దం॥ వజ్రముధరించినవాఁడా ! ఏసోమము పానము చేసినందున గలిగిన బలముతో వృత్రుని సంహారించితివో ఆ మదముగలిగించునట్టి, చల్లఁదనమునిచ్చునట్టి, డేగ రూపమును బొందిన గాయత్రిచేత ద్యులోకమునుండి తేఁబడి యభిషవించిన; సోమము నిన్ను మదింపఁజేసెను.

౮౮౦. ప్రేహ్యభీహి ధృష్ణుహి న తే వజ్రో నియంసతే ।
ఇన్ద్ర నృమ్ణంహి తే శవోహనో వృత్రంజయా అపోఽర్చన్ననుస్వరాజ్యమ్॥

దం॥ ఇంద్రా ! హెచ్చుగాగమనింపుము. (శత్రుల) కభిముఖముకమ్ము. వారిందిరస్కరింపుము. నీవజ్రము శత్రువులకసాధ్యము. నీబలము పురుషులను లొంగఁదీయును. కనుక మేఘమును గొట్టుము. ఉదకముల గెల్చుకొమ్ము. నీవే సర్వాధికారివని ప్రకటన యగునట్లుచేసి స్వరాజ్యము సాగింపుము.

౮౮౧. నిరిన్ద్రభూమ్యా అధివృత్రం జఘన్థ నిర్దివః ।
సృజా మరుత్వతీ రవ జీవధన్యా ఇమా అపోఽర్చన్ననుస్వరాజ్యమ్॥

వ॥ ఇంద్రుఁడా! భూమిమీఁద మేఘమును నిశ్శేషముగాఁగొట్టితివి. ద్యులోకము నుండి వెడలఁగొట్టితివి. ప్రాణులందఱు తృప్తిపఱచునట్టి, గాలితోఁగూడినట్టి, యీ వర్షోదకమును గ్రిందికిఁ బడవేయుము. నీదేస్వరాజ్యమను నట్లు ఇత్యాది పూర్వవతు.

౮౦॥౨. ఇన్ద్రోవృత్రస్య దోధతః సానుం వజ్రేణ హీళితః।

అభిక్రమ్యావ జిఘ్నతే పః సర్మాయ చోదయన్నర్చన్ను స్వరాజ్యమ్॥

వ॥ కోపముగల యింద్రుఁడెదురునడిచి గడగడ వడకించుచున్న వృత్రుని దవుడను (అనఁగా మేఘముమీఁదిభాగమును) ఉదకములంబ్రవహించుటకై; కొట్టెను. తనదే స్వరాజ్యమిత్యాదిపూర్వవతు.

౮౦॥౩. అధిసానౌ నిజిఘ్నతే వజ్రేణ శతపర్వణా।

మన్దాన ఇన్ద్రో అన్ధసః సఖిభ్యోగాతుమిచ్ఛ త్యర్చన్ను స్వరాజ్యమ్॥

వ॥ ఇంద్రుఁడు నూరంచులవజ్రముతో (వృత్రుని) దవుడలమీఁద గట్టిగాఁగొట్టెను ఆ యింద్రుఁడు స్తుతింపఁబడి తనమిత్రులకు (అనఁగా ఋత్విగ్యజమానులకని తా॥) అన్నముగలుగు నుపాయమును గోరుచున్నాఁడు. తనదే స్వరాజ్యమను కొన్నట్లు ఇత్యాదిపూర్వవతు.

౮౦॥౪. ఇన్ద్ర తుభ్య మిదద్రివో నుత్తం వజ్రి న్వీర్యమ్।

యద్ధత్యం మాయినమ్మృగం తముత్వం మాయయా వధీరర్చన్ను స్వరాజ్యమ్॥

వ॥ ఓ మేఘవాహనా! వజ్రధారీ! ఇంద్ర! నీసామర్థ్యము శత్రువులకులొంగదు. కనుకనే ఆ సామర్థ్యముతో మాయావియయిన, మృగరూపము బొందిన ఆ వృత్రుని నీవుఁగూడ మాయతోనే వధించితివి. (మాయ=జయోపాయము) నీదే స్వరాజ్యమను కొనునట్లు ఇత్యాదియథా పూర్వము.

౮౦॥౫. వి తే వజ్రాసో అస్థిర న్నవతి న్నావ్యా ౩ అను।

మహత్త ఇన్ద్రవీర్యం బాహ్వోస్తే బలం హితమర్చన్ను స్వరాజ్యమ్॥

దం॥ నీపద్దనుండి బయలు దేరిన వజ్రాయుధములు; ఓడలతో దాటఁదగిన తొంబది తొమ్మిది నదులను గుఱిచూచి (వృత్రుఁడు వాటిని బయటికి రాకుండఁ బట్టుకొని యున్నాఁడు అని తెలిసి) వివిధరూపములం చెదరి (సంహరించినవి.) ఇంద్రా! నీ వీర్యము గొప్పది. నీ బాహువులందు బలము చేఁబడినది. నీదే స్వారాజ్యమనుకొను నిత్యాది పూర్వవతు.

౯౫౬. సహస్రం సాకమర్చత పరిష్టోభత వింశతిః ।

శతైనమన్వనోనవు రిన్ద్రాయ బ్రహ్మోద్యత మర్చన్నను స్వరాజ్యమ్॥

దం॥ వేయిమంది కలిసి యింద్రుని బూజించిరి. ఇరువదిమంది (పదాఱుగురు ఋత్విజులు, యజమాన, పత్ని, సదస్య, శమితలు) స్తుతించిరి. నూఱుమంది (ఋషులు) యింద్రుని మాటిమాటికి స్తుతించిరి. ఈ యింద్రునికొఱకు (హవిస్సురూపమున) నిచ్చుటకు అన్నము మీఁదికెత్తి పట్టుకొనంబడెను. తనదే స్వారాజ్య మిత్యాది పూర్వవతు.

౯౫౭. ఇన్ద్రో వృత్రస్య తవిషీం నిరహన్ సహసా సహః ।

మహత్తదస్య పౌంస్యం వృత్రంజఘన్వా అసృజ దర్చన్నను స్వరాజ్యమ్॥

దం॥ ఇంద్రుఁడు వృత్రుని బలమును (తన) బలముతోఁ గొట్టివేసెను. ఆయుధము తో నాయుధమును గొట్టివేసెను. ఆ యింద్రుని బలము గొప్పది, కనుకనే వృత్రుని గొట్టెను. ఉదకములఁ గార్చెను. తనదే స్వారాజ్యమనునట్లు ఇత్యాదిపూర్వవతు.

౯౫౮. ఇమేచిత్తవమన్యవే వేపేతే భియసామహీ ।

యదిన్ద్ర వజ్రిన్నోజసా వృత్రం మరుత్వాఅవధీ రర్చన్నను స్వరాజ్యమ్॥

దం॥ ఓ యింద్రా! మరుత్తులతోఁ గూడి నీవు బలము చేత వృత్రుని నెప్పుడు చంపితివో అప్పుడు గొప్పవియగు నీ స్వర్లోక భూలోకములు నీ కోపమునకు భయపడి వణఁకు చుండెను. నీదే స్వారాజ్యమనుకొనునట్లు ఇత్యాది పూర్వవతు.

౯౬౯. న వేపసా న తన్యతేన్ద్రం వృత్రో విబీభయత్ ।

అభ్యేనం వజ్ర ఆయసః సహస్రభృష్టి రాయతా ర్చన్ననుస్వరాజ్యమ్॥

వం॥ వృత్రుండు తనకు వణంకుటచేతను, తనగర్జనధ్వని చేతను, వృత్రుండింద్రుని భయపెట్ట లేక పోయెను. ఇనుముతో చేసిన వేయంచుల వజ్రాయుధము వృత్రునింగొట్టెను. తనదే స్వరాజ్య మిత్యాదిపూర్వవతు.

౯౭౦. యద్వృత్రం తవ చాశనిం వజ్రేణ సమయోధయః ।

అహిమిన్ద్ర జిఘాంసతో దివి తే బద్బధే శవోర్చన్ననుస్వరాజ్యమ్॥

వం॥ ఇంద్రా! వృత్రుని వజ్రాయుధమును నీవజ్రాయుధముతో నెపుడుకొట్టితివో యప్పుడు వృత్రునిఁజంపఁదలఁచిన నీబలము ద్యులోకమును వ్యాపించెను. నీదే స్వరాజ్యమనునట్లు ఇత్యాదిపూర్వవతు.

౯౭౧. అభిష్టనే తే అద్రివో యత్స్థా జగచ్చ రేజతే ।

త్వష్టా చిత్తవ మన్యవ ఇన్ద్ర వేవిజ్యతే భియార్చన్ననుస్వరాజ్యమ్॥

వం॥ ఓ వజ్రధారీ! నీవు సింహనాదము చేయఁగానే స్థిరచరములన్నియుఁ గంపించెను. త్వష్టకూడ (=వజ్రాయుధము చేసినవాఁడు) నీకోపమునకు భయపడి కంపించెను. నీదే స్వరాజ్యమనునట్లు ఇత్యాది పూర్వవతు.

౯౭౨. నహి ను యాదధీమసీన్ద్రం కో వీర్యా పరః ।

తస్మిన్నృమ్ణముత క్రతుం దేవా ఓజాంసి సందధు రర్చన్ననుస్వరాజ్యమ్॥

వం॥ సర్వత్రవ్యాపించియున్న యింద్రుని మేము తెలియలేకున్నాము. నీవ్య వంటివాఁడై యెవరికిని తెలియనిచోట నున్న యింద్రుని మనుష్యుఁడెవఁడు గుర్తింపఁ గలఁడు? (ఏమంటే=) ఆ యింద్రునందు దేవతలు ధనమును, కర్మను, మఱియు బలమును, నిల్పియున్నారు. తనదే స్వరాజ్య మిత్యాది పూర్వవతు.

౮౬౩. యామథర్వా మనుష్పితా దధ్యఙ్ ధియ మత్నత ।
తస్మిన్ బ్రహ్మాణి పూర్వథేన్ద్ర ఉక్థా సమగ్మతార్చన్నను స్వరాజ్యమ్॥

త॥ అథర్వర్షియుఁ బ్రజలందఱి తండ్రియగు మనువును దధ్యఙ్ఙృషియు (=ఇతఁడథర్వపుత్రుఁడు) ఏకర్మ నొనర్చిరో ఆకర్మయందు (హవిస్సురూపమయిన) అన్నములు ఉక్థలు (సామమంత్రాలు) పూర్వులయజ్ఞములందువలె ఇంద్రునికే చెందియున్నవి.

## షష్ఠమాధ్యాయము.

—:-o-:—

### సూక్తము ౮౧.

(ఋషి - రహూగణపుత్రుఁడగు గౌతముఁడు. దేవత - ఇంద్రుఁడు. ఛందస్సు - పఙ్క్తి.)

౫౬౪. ఓమ్ ఇన్ద్రో మదాయ వావృధే శవసే వృత్రహా నృభిః ।
తమిన్మహత్స్వాజిషూతేమర్భే హవామహే స వాజేషు ప్ర నోఽవిషత్ ॥

వ॥ వృత్రుని జంపిన యింద్రుఁడు ఉత్సాహముకొఱకు బలముకొఱకు ఋత్విజుల చేత (స్తోత్రములతో) హెచ్చరింపఁబడెను. గొప్పయుద్ధములందా యింద్రునే పిలుచుచున్నాము. (మఱియు) ఇతనిని చిన్నయుద్ధములందును, గొప్పయుద్ధములందును, పిలుచుచున్నాము. ఆతఁడు యుద్ధములందు మమ్ము రక్షించుచుఁగాక.

౫౬౫. అసి హి వీర సేన్యోఽసి భూరి పరాదదిః ।
అసి దభ్రస్య చిద్వృధో యజమానాయ శిక్షసి సున్వతే భూరి తే వసు ॥

వ॥ వీరుఁడవగు నో యింద్రా! సేనతోఁ గూడి జయించుదువు. విస్తారమైన ధనమును శత్రువులనుండి బరాభవించి తెత్తువు. నిన్ను స్తుతించినవాఁడల్పుఁడయ్యును వానికి వృద్ధినొందింతువు. యాగము చేసినవానికిని, సోమమునభిషవించినవానికిని, విస్తారముగా ధనమిత్తువు.

౫౬౬. యదుదీరత ఆజయో ధృష్ణవే ధీయతే ధనా ।
యుక్ష్వా మదచ్యుతా హరీ కం హనః కం వసౌ దధోఽస్మాఁ ఇన్ద్ర వసౌ దధః ॥

వ॥ యుద్ధములు తటస్థించినపుడు జయించినవానికి ధనములు లభించును. శత్రువుల మదమణఁగించు నీ రెండు గుఱ్ఱములును ఇంద్రా! పూన్పుము, ఒకని జంపుదువు, ఒకనికి ధనమిత్తువు, మాకును ధనమిమ్ము (అని గౌతముఁడు సృంజయదేశరాజు పురోహితుఁడై యీ యింద్ర సూక్తము జపించెను.)

౧౬౭. క్రత్వా మహాఁ అనుష్వధం భీమ ఆవా వృధే శవః ।

శ్రియ ఋష్వ ఉపాకయో ర్నిశిప్రీహరివాన్ దధే హస్తయోర్వజ్ర మాయసమ్॥

తా॥ కర్మచేత గొప్పవాఁడు, భయంకరుఁడునగు నింద్రుఁడు (సోమరూప) అన్నము-పానముచేసి బలమును వృద్ధిపఱచుకొనెను. గొప్పదవుడలు కలవాఁడును దర్శనీయుఁడు నైన యింద్రుఁడు హరియనెడు గుఱ్ఱములతోఁగూడి యినుముతోఁ జేయఁబడినవజ్రమును చేతులందు సంపదనిమిత్తము ధరించెను.

౧౬౮. ఆ పప్రౌ పార్థివం రజో బద్బధే రోచనాదివి ।

న త్వావాఁ ఇన్ద్ర కశ్చన న జాతో న జనిష్యతేతి విశ్వం వవక్షిథ॥

తా॥ ఇంద్రుఁడు పృథివిలోని వస్తువులను అంతరిక్షమును ఆవరించియుండెను. ద్యులోకసంస్థానక్షత్రాదులనిల్పెను. (మేఘములదాఁకి అంతరిక్షము) ఇంద్రా! నీవంటివాఁడిదివఱకు నెవ్వఁడు పుట్టలేదు, పుట్టఁబోఁడు. నీవు జగత్తునంతటిని బాగుగ వహింపఁ గలుగుదువు.

౧౬౯. యోఅర్యో మర్తభోజనం పరాదదాతి దాశుషే ।

ఇన్ద్రో అస్మభ్యం శిక్షతు విభజాభూరి తేవసు భక్షీయ తవరాధసః॥

తా॥ పాలకుండైన యింద్రుఁడు మనుష్యులకిను నన్నమును హవిస్సులనిచ్చు (యజమానునకు) నిచ్చును. మాకిచ్చుటకు ధనము నింద్రా! వంతులు వేయుము. (పంచుము) నీకు విస్తారము ధనమున్నది. నీధనములోని భాగమునే ననుభవింతును.

౧౭౦. మదే మదే హినో దదిర్యూథా గవా మృజుక్రతుః ।

సంగృభాయ పురూ శతో భయాహస్త్యా వసు శిశీహి రాయ ఆభర॥

తా॥ సోమపానమదము గల్గినప్పుడెల్లఁ జక్కనిపనులుచేయు నింద్రుఁడు మాకు ఆలమందల నిచ్చువాఁడగును. ఇంద్రా! నీవు విస్తారమైన నూర్లకొలంది ధనములను రెండు చేతులతోను (మాకిచ్చుటకై) ధరింపుము. మమ్ములను జరుకుగలవారినిగాఁ జేయుము. ధనములనిమ్ము.

౯౮౧. మాదయస్వ సుతే సచా శవసే శూర రాధసే ।

విద్మాహి త్వా పురూవసు ముపకామాన్త్ససృజ్మహే ఽథానో ఽవితాభవ॥

వం॥ ఓ శూరా! సోమమభిషవించఁగానే (మా) ధనముకొఱకు, బలముకొఱకును. నెస్తుతా! తృప్తిఁగాంచుము. నీవెక్కుడుధనము కలవాఁడవని మేమెఱుంగుదుము మాకోరికలను నీకెఱిఁగింతుము (సంప్రదించుట) మమ్ము రక్షించువాఁడవు కమ్ము.

౯౮౨. ఏతేత ఇన్ద్ర జంతవో విశ్వం పుష్యన్తి వార్యమ్ ।

అన్తర్హిఖ్యో జనానా మర్యో వేదో అదాశుషాం తేషాం నోవేద ఆభర॥

వం॥ ఓ యింద్రా! నీవారైన యీ యజమానులు కోరఁదగిన హవిస్సునంతయు వృద్ధిచేయుచున్నారు. హవిస్సుల నివ్వనివారిదగ్గఱనున్న ధనమును స్వామివైన నీవు చూచుచున్నావుకదా! ఆజనుల ధనమును దెచ్చి మాకిమ్ము.

---

### సూక్తము. ౮౨.

(ఋషి - గోతముఁడు; దేవత - ఇంద్రుఁడు: ఛందస్సు ౧, ౫, పఙ్క్తిః; ౬, జగతి.)

౯౮౩. ఉపో షు శృణుహీ గిరో మఘవ న్మాతథా ఇవ ।

యదానః సూనృతావతః కర ఆదర్థయాస ఇద్యోజాన్విన్ద్ర తేహరీ॥

వం॥ ధనవంతుఁడవగు నింద్రా! మాస్తుతులను సమీపమునకువచ్చి వినుము ఇదివఱకు మాయెడల నీవు ప్రవర్తించినదానికి వ్యతిరేకముగా నుండకుము. మమ్ము నెపుడు సత్యవచనులనుగాఁ జేయుదువో ఆవెంటనే యాచింపఁజేసుకొందువు; కనుక నోయింద్రా! నీరెండు గుఱ్ఱములును (రథమునకు) బూన్చుము.

౯౮౪. అక్షన్నమీమదన్త హ్యవ ప్రియా అధూషత ।

అస్తోషత స్వభానవో విప్రా నవిష్ఠయా మతీ యోజా న్విన్ద్ర తేహరీ॥

ప౦॥ ఇంద్రా! (నీవిచ్చిన) యన్నములను (యజమానులు) భక్షించిరి. తృప్తిని బొందిరి. శరీరములు కదల్చుచుకొనిరి. స్వాధీనబుద్ధులుగల విప్రులు అత్యంతనూతనములగు స్తుతులతో స్తుతించిరి. కనుక నింద్రా! నీ రెండు గుఱ్ఱములను రథమునకుఁ బూన్చుము.

౮౭౩. సుసంౘృశం త్వావయం మఘవ న్వందిషీమహి।

ప్రనూనం పూర్ణవంధురః స్తుతో యాహి వశాఁ అను యోజా న్విన్ద్ర తేహరీ॥

ప౦॥ ఇంద్రా! అందఱును బాగుగఁజూచునట్టి నిన్ను మేముస్తుతింతుముగాక. నిండురథముతోనుండినవాఁడవై యాకోరుచున్న వారిఁగూర్చి తప్పక బయలుదేరుము. రెండుగుఱ్ఱాలు ఇత్యాదిపూర్వవతు.

౮౭౪. సఘాతం వృషణం రథ మధితిష్ఠాతి గోవిదమ్।

యఃపాత్రం హారియోజనం పూర్ణమింద్రచికేతతి యోజా న్విన్ద్ర తేహరీ॥

ప౦॥ ఏయింద్రుఁడు హారియోజనమను పేరుగల్గి సోమరసముతోనిండిన పాత్రముగానున్న రథము జ్ఞాపకముంచుకొనుచున్నాఁడో ఆయింద్రుఁడా! వర్షమును గురియునట్టి గోవులనిచ్చునట్టి ఆరథము నెక్కుము. రెండు గుఱ్ఱములు నీరథమునకుఁ బూన్చుము.

౮౭౫. యుక్తస్తే అస్తు దక్షిణ ఉతసవ్యః శతక్రతో।

తేనజాయా ముపప్రియాం మన్దానో యాహ్యన్ధసో యోజా న్విన్ద్ర తేహరీ॥

ప౦॥ ఓ శతక్రతూ! (=అనేక కార్యములు సేయువాఁడా!) నీరథమందుఁ గుడిప్రక్కననున్నదియు, నెడమప్రక్కననున్నదియు, గుఱ్ఱములు పూన్పఁబడుఁగాక. ఆ రథముతో (వచ్చి) సోమరూపాన్నమును బానముసేసి మదించినవాఁడవై ప్రియురాలగు భార్యను సమీపించుము. నీ రెండు గుఱ్ఱము లిత్యాదిపూర్వవతు.

౮౭౬. యునజ్మి తే బ్రహ్మణా కేశినా హరీ ఉపప్రయాహి దధిషే గభస్త్యోః।

ఉత్వాసుతా సోరభసా అమన్దిషుః పూషణ్వాన్వజ్రి న్త్సము పత్న్యామదః

దం॥ ఓ యింద్రా! జొమ్ముగల నీ రెండు గుఱ్ఱములు స్తుతిమంత్రములతోఁ బూన్తును. దానితో నీ యింటికిఁ బొమ్ము. చేతితోఁ [illegible]ముఁబట్టుకొనుము. అభిషవించిన సోమములు వేగముగలవై నిన్ను ఎక్కువమత్తుకలవానిని జేసినవి. వజ్రీ! పుష్టిగల్గి నీభార్యతోఁ దృప్తినందుము.

—:-०-:—

## సూ క్త ము, ౮౩.

(ఋ షి - గౌతముఁడు; ఛందస్సు - జగతి; దేవత - ఇంద్రుఁడు.)

౫౭౯. అశ్వావతి ప్రథమో గోషు గచ్ఛతి సుప్రావీరింద్ర మర్త్యస్తవోతిభిః ।
తమిత్పృణక్షి వసునా భవీయసా సింధుమాపో యథాభితో విచేతసః॥

దం॥ ఇంద్రా! మనుష్యుఁడు నీరక్షణలచేతఁ జక్కఁగా రక్షింపఁబడినవాఁడును, అనేకమయిన గుఱ్ఱములుగల (యింటిలోనుండి) గోవులవిషయమున మొదటివాఁడై నడచును (గోవులను బుచ్చుకొనువారిలో ముందునడచుననియు, గుఱ్ఱములదివఱకే కలిగియున్నాఁడనియు తా॥) నీవతనినే విస్తారధనముతోను; విశేషజ్ఞానమును గలిగించు నుదకములు సర్వత్రా సముద్రుని బూరించునట్లు; పూరింతువు.

౫౮౦. ఆపోన దేవీ రుపయన్తి హోత్రియ మవః పశ్యన్తి వితతం యథారజః ।
ప్రాచైర్దేవాసః ప్రణయన్తి దేవయుం బ్రహ్మప్రియం జోషయన్తేవరాఇవ॥

దం॥ హోతయొక్క పాత్రను ప్రకాశించు నుదకములు చేరునట్లు; విస్తీర్ణమయిన సూర్యకాంతిక్రిందికిఁబడునట్లు; దేవతలందఱు చుట్టుమూఁగి తమదృష్టులను సారింతురు. దేవతలందఱును గోరుకొను నీపాత్రను బ్రహ్మప్రియమును పేరి దానిని సిద్ధపఱతురు. దేవతలందఱు దానిని (కన్యను) వరులు కామించునట్లు కామింతురు.

౫౮౧. అధిద్వయో రదధా ఉక్థ్యం౧ వచో యతస్రుచా మిథునా యాసపర్యతః ।
అసంయత్తో వ్రతే తే క్షేతి పుష్యతిభద్రా శక్తిర్యజమానాయ సున్వతే॥

వం॥ ప్రపంచములు నిర్మించిన శోభనగానున్న యేయేయే హవిస్సులు నిన్ను బూజించుచున్నవో ఆయాయాయపేక్షించిన యింద్రా! నీవు "యుక్తేవాం" అను సూక్తమంత్రము నుంచితివి. యజమానుడు శత్రువులయొక్క యుద్ధమునకుఁబోవక నీ వ్రతమునందుండును. తృప్తిగానుండును. నీకై హోమమునభిషవించిన యజమానునకు గళ్యాణప్రదమయిన శక్తి కలుగును.

౮౮౪. ఆదంగిరాః ప్రథమం దధిరే వయ ఇద్ధాగ్నయః శమ్యా యే సుకృత్యయా ।
సర్వం పణేః సమవిన్దన్త భోజన మశ్వావన్తం గోమన్త మాపశుం నరః॥

వం॥ (పణి గోవులనపహరించిన) తరువాత నంగిరో ఋషులు ముందుగా హవిస్సును ధరించిరి. వారు ప్రజ్వలించిన యగ్నులు కలవారై చక్కని సాధనములుగల శోభన కర్మములచేత నింద్రుని బూజించిరి. వారు పణియొక్క గుఱ్ఱములను, గోవులను, ఇతరపశువులను ధనమునుం దీసికొనిరి

౮౮౫. యజ్ఞై రథర్వా ప్రథమః పథ స్తతే తతః సూర్యో వ్రతపా వేన ఆజని ।
ఆగా ఆజ దుశనా కావ్యః సచా యమస్యజాతమమృతం యజామహే॥

వం॥ (గోవులపణిహరించిన తరువాత) అథర్వర్షి యింద్రయాగమొనర్చి గోవుల మార్గములను ముందుగాఁ జక్కపఱచెను. అథసూర్యుఁడాగోవుల నభిముఖముగాఁ బొందెను. కవిపుత్రుఁడగు నుశనుఁడు (శుక్రాచార్యులు) ఆ యింద్రునకు సహాయుఁడయ్యెను. వ్రతములను బాలించుచుఁ బ్రకాశించు సూర్యుఁడావిర్భవించెను. రాక్షసుల నడంచుట నావిర్భవించినవాఁడును, మరణధర్మము లేనివాఁడునగు నింద్రుని మేము పూజింతుము.

౮౮౬. బర్హిర్వా యత్స్వపత్యాయ వృజ్యతేऽర్కో వా శ్లోక మాఘోషతే దివి ।
గ్రావా యత్ర వదతి కారురుక్థ్య స్తస్యే దిన్ద్రో అభిపిత్వేషు రణ్యతి॥

వం॥ విఘ్నము లేని సుకర్మకొఱకు దర్భయెప్పుడు కోయఁబడినదో; స్తుతినొనరించు హోత యజ్ఞమందు స్తుతిమంత్ర మెప్పుడు పఠించెనో; ఉక్థము జేసిన స్తోత్ర ధ్వనించు నట్లు; అభిషవశిల యెప్పుడు ధ్వనించెనో; యీయన్నికాలములందును ఇంద్రుఁడు సంతసించును.

———

౭౦॥ ఇంద్రా! మిక్కిలి ప్రశస్తమై మదమును గలిగించునట్టి, చావులేకుండఁ జేయునట్టి, సోమము ద్రావుము. యజ్ఞగృహమందు తీవ్రమగు (ఎక్కుడు మదము చేయుదానికి తీవ్రవిశేషణము) సోమరసధారలు నీకభిముఖముగాఁ బ్రసరించుచున్నవి.

౫౨౯. ఇన్ద్రాయ నూన మర్చతోక్థాని చ బ్రవీతన ।

సుతా అమత్సు రిన్దవో జ్యేష్ఠం నమస్యతా సహః॥

వం॥ ఋత్విజులారా! శీఘ్రముగా నింద్రుని బూజింపుఁడు. ఉక్థను బఠింపుడు. అభిషవించిన సోమములు (ఇంద్రుని) మదింపఁజేయుత. ప్రశస్తుమయిన బలవంతుఁ డయిన యింద్రుని నమస్కరింపుడు.

౫౩౦. నకిష్ట్వ ద్రథీతరో హరీ యదిన్ద్ర యచ్ఛసే ।

నకిష్ట్వాను మజ్మనా నకిః స్వశ్వ ఆనశే॥

వం॥ ఇంద్రా! హరియనుపేరి రెండు గుఱ్ఱములను రథమందుఁ బూన్చితివికనుక నీకంటె నెక్కుడు రథికుఁడు మఱిలేడు. నీవంటి బలవంతుఁడును లేడు. మంచిగుఱ్ఱములు గల యన్యుఁడు నిన్ను సమీపింపఁజాలఁడు.

౫౩౧. య ఏక ఇద్విదయతే వసు మర్తాయ దాశుషే ।

ఈశానో అప్రతిష్కుత ఇన్ద్రో అఙ్గ॥

వం॥ ఏయింద్రుఁడొక్కఁడే హవిస్సులనిచ్చు మనుష్యునకు ధనమిచ్చునో (అతఁడు) ఎదురాడ శక్యముగాని వాఁడై సర్వజగమునకు నీశ్వరుఁడు.

౫౩౨. కదా మర్తమరాధసం పదా క్షుమ్పమివ స్ఫురత్ ।

కదా నః శుశ్రవద్గిర ఇన్ద్రో అఙ్గ॥

వం॥ యజ్ఞముచేయని మనుష్యుని యింద్రుఁడెపుడు పుట్టగొడుగు (పుట్టగొక్కని కూడ వాడుకకలదు) నుంబలె నొక్కివేయునో? కదా! మాస్తుతుల నింద్రుఁడెపుడు శీఘ్రముగ వినునో? కదా!

ఋ౩. యశ్చిద్ధి త్వా బహుభ్య ఆ సుతావాఁ ఆవివాసతి ।
ఉగ్రం తత్పత్యతే శవ ఇన్ద్రో అఙ్గ ॥

ప॥ అనేక మనుష్యులలో నేయజమానుఁడు సోమమునభిషవించి నిన్ను సేవించునో యాతనికి ఉగ్రమయిన బలము నింద్రుఁడు శీఘ్రముగా నిచ్చును.

ఋ౪. స్వాదోరిత్థా విషూవతో మధ్వః పిబన్తి గౌర్యః ।
యా ఇన్ద్రేణ సయావరీర్వృష్ణా మదన్తి శోభసే వస్వీరను స్వరాజ్యమ్ ॥

ప॥ ఏగోవులు వర్షించువాఁడగు నింద్రునితోఁ గూడి శోభార్థ సంచరించునో ఆగోవులు రుచియయిన సోమరసమును సర్వయజ్ఞములలో నిల్చి యింద్రుఁడు త్రావగా మిగిలినదానిని త్రావి మదించుచున్నవి. నివాసమునకు ముఖ్యోపయోగమగు పాల నిచ్చుచున్నవై యింద్రరాజ్యము తమదేయని భావించుచున్నవి.

ఋ౫. తా అస్య పృశనాయువః సోమం శ్రీణన్తి పృశ్నయః ।
ప్రియా ఇన్ద్రస్య ధేనవో వజ్రం హిన్వన్తి సాయకం వస్వీరను స్వరాజ్యమ్ ॥

ప॥ ఇంద్రుని స్పర్శనుగోరిన నానావర్ణగోవులు సోమరసమును తమపాలతోఁ గలుపుచున్నవి. ఇంద్రునకు ప్రియములగు నాధేనువులు శత్రువులఁ జంపుపట్టి వజ్రమును (శత్రులమీఁదు) విసరుచున్నవి. నివాసమునకు ముఖ్యాధారమయిన గోవులింద్రరాజ్యము తమరాజ్యమనిత్యాదిపూర్వవతు.

ఋ౬. తా అస్య నమసా సహః సపర్యన్తి ప్రచేతసః ।
వ్రతాన్యస్య సశ్చిరే పురూణి పూర్వచిత్తయే వస్వీరను స్వరాజ్యమ్ ॥

ప॥ ఆగోవులుత్కృష్టజ్ఞానముకలవై ఇంద్రుని బలమును (తమపాల) ఆహారముతో బోషించుచున్నవి. ఇంద్రుని బహువిధ కార్యములను తెలియుటకై యొజ్జీక చేయును. ప్రజల నివాసహేతువులైన గోవులిత్యాది పూర్వవతు,

ఋ౭. ఇన్ద్రో దధీచో అస్థభిర్వృత్రాణ్యప్రతిష్కుతః । జఘాన నవతీర్నవ ॥

తా॥ [illegible] దధీచిమహర్షియొక్క [illegible] యెముకలతో తొంబదితొమ్మిది వృత్రులను జంపెను. (అనఁగా — మూఁడు లోకముల చేతఁ బట్టబడియున్న వృత్రశక్తులు మొత్తము మూఁడయ్యెను. అందొక్క దానికొకటి భూతభవిష్యద్వర్తమాన భేదముచే మూఁడేసి యయ్యెను. మొత్తము తొమ్మిది. అందొక్కొక్కటియు [illegible] మంత్రశక్తుల నాశ్రయించి మూఁడేసి కాఁగా మొత్తే మిరువదియేడు. [illegible] జన్తమో భేదమున ఎన భై యొక్కటి యయ్యె. ఇట్టివి పదిదిక్కులనుండి చేరి దేవతలు వృత్రునితో సాటిలేక దధీచి మహర్షి మునకు వెళ్ళగానే యతని దేహమెక్కడ కలదాయని ప్రశ్నింప నతని యుపదేశమున కురుక్షేత్రమునకుఁబోయి దేవతలు వెదకిరట! అచటి నదీసమీపమున నతని గుఱ్ఱముతలకాయ కనంబడెనట! దాని యెముకముక్కలతో వృత్రాసురులను (౮౧౦) ఎనిమిదివందల పదిమందిని యింద్రుఁడు చంపెనట—ఇది పురాణములో దానికి భిన్నముగానున్నది.)

౯౯౮. ఇచ్ఛన్నశ్వస్య యచ్ఛిరః పర్వతేష్వపశ్రితమ్ । తద్విదచ్ఛర్యణావతి॥

తా॥ పర్వతములందు నశ్వశిరస్సు జారిపడినది. (అది దధీచిది) దానినింద్రుఁడు కోరఁగా శర్యణావతి యను నదిలో ఆతల దొరకెను.

౯౯౯. అత్రాహ గోరమన్వత నామ త్వష్టురపీచ్యమ్ । ఇత్థా చన్ద్రమసో గృహే॥

తా॥ గమనించునట్టి చంద్రునియొక్క యీ గృహమందే (అంటే మండలము) రాత్రి కనంబడనట్టి త్వష్టయొక్క (=సూర్యుఁడే. దీపించువాఁడవిన్ను) తేజస్సు తెలిసికొనిరి. (చంద్రుని మండలమందు సూర్యమండలములోకాన్తి రాత్రి ప్రవేశించు నని తా॥)

౧౦౦౦. కో అద్య యుఙ్క్తే ధురి గా ఋతస్య శిమీవతో భామినో దుర్హృణాయూన్ ।
ఆసన్నిషూన్ హృత్స్వసో మయోభూన్య ఏషాంభృత్యామృణధత్స జీవాత్॥

తా॥ ఈ కర్మదగ్గరకు వచ్చిన ఇంద్రరథము నొగలందు గమనశీలములును, వీర్యవంతులు, తేజోవంతులు, శత్రులకు సాధ్యముకాని కోపముకలవియు, నోటిలోనే బాణములుకలవియు, (శత్రువుల) గుండెలమీఁద బాణము వేయునవియు నగు నింద్రుని గుఱ్ఱములను నేఁడు పూన్చఁగలఁడు? (శక్యముకాదనితా॥) ఈ వాక్కును బోషించువాఁడు బ్రతుకఁగాత.

౯౦౧. కఈమ తే తుజ్యతే కోబిభాయ కోమంసతే సన్తమిన్ద్రం కోఅన్తి।
కస్తోకాయ కఇభా యోతరాయే ధ్యబ్రవత్తన్వేకోజనాయ॥

వం॥ (ఇంద్రుండిచ్చును హింసింపవచ్చునప్పుడు) ఎవఁడు శత్రువునకు భయపడి పారిపోవును? ఎవఁడు హింసింపఁబడును? ఎవఁడు భయపడును? మాసమీపమందున్న యింద్రుని ఎవఁడు తెలిసికొనఁగలఁడు? ఏ యజమానుఁడు సంతానము కొఱకును ఏనుఁగులకొఱకును, ధనముకొఱకును, శరీరముకొఱకును, పరివారముకొఱకును వేఁడుకొనును? (కోరకుండనే యింద్రుఁడిచ్చునని తా॥)

౯౦౨. కోఅగ్నిమీట్టే హవిషా ఘృతేన స్రుచా యజాతా ఋతుభిర్ధ్రువేభిః।
కస్మై దేవా ఆవహానాశు హోమకోమంసతే వీతిహోత్రః సుదేవః॥

వం॥ అగ్ని నెవఁడు స్తుతింపఁగలఁడు? స్రుక్కులో నేయిపోసి యేయజమానుఁడు నిత్యములగు వసంతాది ఋతువులలో నగ్నిని యజించును? ఏయజమానునకు దేవతలు శీఘ్రముగా హోమద్రవ్యములను సమకూర్పఁగలరు? యజ్ఞమారంభించి శోభనదేవతలు గలయేయజమానుఁడు తెలిసికొనఁగలఁడు? (ఎవరికిని శక్యముకాదని తా॥) ఇచట నగ్నియనునామముకు నింద్రుఁడనియే నాయువాక్యము. ఇంద్రసూక్తము నుండ్రనన్నదికనుక

౯౦౩. త్వమఙ్గ ప్రశంసిషో దేవః శవిష్ఠ మర్త్యమ్।
నత్వదన్యో మఘవన్నస్తి మర్డితేన్ద్ర బ్రవీమి తేవచః॥

వం॥ ఓయీ! గొప్పబలవంతుఁడా! ప్రకాశించునీవు మర్త్యుని మెచ్చుకొనుము. ఓధనవంతుఁడవగు నింద్రా! నీకంటె నితరుఁడు సుఖింపఁజేయువాఁడులేఁడు. కనుక నీస్తుతిమంత్రముఁ జదివెంచుచున్నాము.

౯౦౪. మాతేరాధాంసి మాతఊతయో వసోస్మాన్కదాచనా దభన్।
విశ్వాచన ఉపమిమీహి మానుష వసూని చర్షణిభ్య ఆ॥

వ॥ నివాసహేతువగు నోయింద్రా! నీయన్నములు, నీరక్షణములు మమ్ము బాధలుచెందకుండ రక్షించుఁగాక. మనుజులకు మేలుకూర్చువాఁడా! సమస్తధనములను మంత్రద్రష్టలమగు మాకుఁ దెచ్చిపెట్టుము.

ఇట్లు ప్రథమమండలమున బదుమూఁడవ యనువాకము. శ్రీ శ్రీ శ్రీ

---

అనువాకము. ౧౪.

సూక్తము. ౮౫.

(ఋషి - గోతముఁడు: దేవత - మరుత్తులు; ఛందస్సు - ౫, ౧౨, త్రిష్టుప్; తక్కినవి జగతి.)

౧౦౫౫. ప్రయే శుంభన్తే జనయో న సప్తయో యామన్రుద్రస్య సూనవః సుదంససః
రోదసీ హి మరుతశ్చక్రిరే వృధే మదన్తి వీరా విదథేషు ఘృష్వయః॥

వ॥ ప్రకాశమైన స్వభావముగలిగి, శోభనకర్మలుకలిగి రుద్రపుత్రులగు మరుత్తులు ప్రయాణము చేయవలసి వచ్చినప్పుడు ఆడువారివలె నలంకరించుకొందురు. (స్త్రీలు అలంకారప్రియులని పూర్వమునుండి సహజము) ద్యావాపృథువులను మరుత్తులు వృద్ధిచేసిరి. పరులను శత్రువులను తిరస్కరించువారునై యజ్ఞములందు (సోమపానముచేత) సంతసించుచున్నారు.

౧౦౫౬. త ఉక్షితాసో మహిమాన మాశత దివి రుద్రాసో అధిచక్రిరే సదః।
అర్చన్తో అర్కం జనయంత ఇన్ద్రియ మధిశ్రియో దధిరే పృశ్నిమాతరః॥

వ॥ ఆమరుత్తులు దేవతలచేత నభిషేకింపఁబడినవారై మహత్త్వనొందిరి. రుద్రుని పుత్రులయి ద్యులోకమునందెక్కుడుగా నివాసము చేసికొనిరి. పూజనీయుఁడయిన యింద్రుని బూజించుచు సామర్థ్యమును గలిగించుచు భూమిపుత్రులయి సంపదల నధికముగాఁబొందిరి.

౯౦౭. గోమాతరో యచ్ఛుభయన్తే అఞ్జిభి స్తనూషు శుభ్రా దధిరేవిరుక్మతః॥

బాధన్తే విశ్వ మభిమాతిన మపవర్త్మా న్యేషామనురీయతే ఘృతమ్॥

వం॥ గోరూపమయినభూమి తల్లిగాఁగల మరుత్తులు ఆభరణములతో నెపుడలంకరించుకొందురో యపుడు కాంతిగలవారై శరీరమునందలంకారములతో శోభిల్లుదురు. ప్రపంచమునంతటిని బాధించు శత్రువుని హింసింతురు. ఈమరుత్తుల మార్గమును అనుసరించి యుదకములు కారును. (ఘృత=ఉదకము.)

౯౦౮. వియేభ్రాజన్తే సుమఖాసఋష్టిభిః ప్రచ్యావయన్తో అచ్యుతా చిదోజసా।

మనోజువో యన్మరుతో రథేష్వావృషవ్రాతాసః పృషతీర యుగ్ధ్వమ్॥

వం॥ మంచియజ్ఞములుకల మరుత్తులు ఆయుధములతో మిక్కిలి ప్రకాశించుచున్నారు. మనసువంటి వేగముగల్గి వర్షించుచుండే పరివారముగల మరుత్తులారా! మీరు రథములను పృషతులతో బూన్చినపుడు గదలింప శక్యముగాని వస్తువులను గదలించుచున్నారు.

౯౦౯. ప్రయద్రథేషు పృషతీరయుగ్ధ్వంవాజే అద్రింమరుతో రంహయన్తః

ఉతారుషస్య విష్యన్తి ధారాశ్చర్మే వోదభిర్వ్యున్దన్తి భూమ॥

వం॥ మరుత్తులారా! అన్నమునిమిత్తము మేఘమును వర్షమునకుఁ బ్రేరించుచు రథములందు దాడలేళ్లను బూన్చినపుడు మిక్కిలి ప్రకాశించు సూర్యునియొక్క (అనఁగా వైద్యుతాగ్నియని తా॥) సమీపమునుండి వర్షోదకధారలను విడుచుచున్నారు. నీటితోఁ జర్మము తడుపునట్లు; ఆధారలు భూమిని దడుపుచున్నవి.

౯౧౦. ఆవోవహన్తు సప్తయో రఘుష్యదో రఘుపత్వానః ప్రజిగాత బాహుభిః।

సీదతా బర్హిరురువః సదస్కృతం మాదయధ్వంమరుతో మధ్వోఅన్ధసః॥

వం॥ మరుత్తులారా! మిమ్ములను శీఘ్రగమనముగల్గి చులకనగా నెగురునట్టి గుఱ్ఱములు తోడుకొనివచ్చునుగాక. మీబాహువులందు ధనముపట్టుకొని రండు. మీరు కూర్చుండుచోటు (వేదిమీఁదనని తా॥) విశాలముచేయఁబడెను. అచటి దర్భలపైఁ గూర్చుండుడు. మధురమగు సోమరూపాహారముతో మదించుడు.

తెచ్చిరి. (గౌతముని దాహముకొఱకు మరుత్తులు నూతిని మీఁదికెత్తి తెచ్చియుండ నొకకొండ యడ్డముగా నుండఁగ బలకొన్ని వచ్చి గౌతముఁడున్న చోట నూతినుదించి యాప్రక్కను జిహ్మగతిని పెట్టి దానితో నూతిలోని యుదకముతో గౌతముని తృప్తి పఱచిరని కథ.)

౧౧. జిహ్మం నునుద్రేవతం తయా దిశాసించన్నుత్సం గోతమాయ తృష్ణజే ।
ఆగచ్ఛంతీమవసా చిత్రభానవః కామం విప్రస్య తర్పయంత ధామభిః॥

దం॥ మరుత్తులు (గౌతమఋషి) యున్నచోటికి వంకరగానున్న నూతిని త్రోసికొని పోయిరి. దాహముతోనున్న గౌతమునకు జలప్రవాహమును జొనిపిరి. నానావిధకాంతుల మరుత్తులే ఋషిసమీపమునకు సర్వరక్షలతో వచ్చిరి. మేధావియగు గౌతముని కోర్కెను ఉదకములతోఁ దృప్తిపఱచిరి. (వెనుక కథచూడుఁడు.)

౧౨. యా వః శర్మ శశమానాయ సంతి త్రిధాతూని దాశుషే యచ్ఛతాధి ।
అస్మభ్యం తాని మరుతో వియంత రయిం నో ధత్త వృషణః సువీరం॥

దం॥ మూఁడులోకములందు నివసించియున్న మరుత్తులారా! మిమ్ము స్తుతించు వాని కివ్వఁదగినవి, మీకు హవిస్సులనిచ్చువాని కివ్వఁదగినవి, యగు గృహములు మాకునిండు. వర్షించు స్వభావముగల మరుత్తులారా! మాకు మంచి పుత్రపౌత్రులతోఁగూడిన ధనమును ఇండు.

---

## సూక్తము ౮౬.

(ఋషి - గౌతముఁడు; దేవత - మరుత్తులు; ఛందస్సు - గాయత్రి)

౧. మరుతో యస్య హి క్షయే పాథా దివో విమహసః । స సుగోపాతమో జనః॥

దం॥ విశేషప్రకాశముగల యో మరుత్తులారా! ద్యులోకమునుండి వచ్చి యే యజమానుని గృహమందు సోమము పానముసేతురో యా యజమానుఁడు మంచి రక్షకులు కలవాఁడగును.

౯౧౮. యజ్ఞైర్వా యజ్ఞవాహసో విప్రస్య వామతీనామ్ । మరుతః శృణుతా హవమ్॥

వం॥ యజ్ఞమును జరిపించు నో మరుత్తులారా! యజమానులయొక్కయు, స్తుతి కర్తలయొక్కయు, స్తుతిమంత్రములతోఁటి పిలుపులవినుఁడు.

౯౧౯. ఉతవా యస్య వాజినో నువిప్ర మతక్షత । సగన్తా గోమతి వ్రజే॥

వం॥ మఱియు నేయజమానుని హవిఃపూపాన్నములతో ఋత్విజులారా! మేధావంతులయిన మరుత్తులను ఉత్సాహపఱతురో యాతఁడు గోవులనేకములుగల మందగలవాఁడగును.

౯౨౦. అస్య వీరస్య బర్హిషి సుతః సోమో దివిష్టిషు । ఉక్థం మదశ్చ శస్యతే॥

వం॥ యజ్ఞదినములలో యజ్ఞవీరులగు మరుద్గణముల (యాగమునకు) సోమమభిషవింపఁబడెను. స్తుతులును, సోమమదమును మెచ్చుకొనంబడెను.

౯౨౧. అస్య శ్రోషంత్వా భువో విశ్వాయశ్చర్షణీ రభి సూరంచిత్స స్రుషీరిషః॥

వం॥ ఏమరుద్గణము సమస్తశత్రువులఁ దిరస్కరింతురో యామరుద్గణము ఈ యజమానుని స్తుతివాక్కును విందురుగాక. స్తుతికర్తకు నన్నములు చేయునుగాక.

౯౨౨. పూర్వీభిర్హి దదాశిమ శరద్భి ర్మరుతో వయమ్ । అవోభిశ్చర్షణీనామ్॥

వం॥ మరుత్తులారా! గతించిన బహుసంవత్సరములనుండి సర్వదర్శకులయిన మీ రక్షణములతో మేము హవిస్సుల నిచ్చుచున్నాము.

౯౨౩. సుభగః సప్రయజ్యవో మరుతో అస్తుమర్త్యః । యస్య ప్రయాంసి పర్షథ॥

వం॥ బాగుగ యజింపఁదగిన మరుత్తులారా! యేయజమానుని హవిస్సులను మీరు స్వీకరించుచున్నారో యతఁడు మంచి ధనవంతుఁడగుఁగాక.

౯౨౪. శశమానస్యవా నరః స్వేదస్య సత్యశవసః । విదా కామస్య వేనతః॥

వం॥ నిజమయిన బలముగల్గి నాయకులగు మరుత్తులారా! మిమ్ము స్తుతించుచు నలసి చమర్చినవాఁడై ప్రకాశించు స్తుతిపాఠకునకు కోర్కెను ఇండు.

౮౨౫. యూయం తత్సత్యశవస ఆవిష్కర్త మహిత్వనా । విధ్యతా విద్యుతా రక్షః॥

వం॥ సత్యమయిన బలముగల మరుత్తులారా! ఆ మీమాహాత్మ్యమును ప్రకటింపుఁడు. దీపించు మహిమతో రక్షస్సులనణంచుఁడు.

౮౨౬. గూహతా గుహ్యం తమో వియాత విశ్వ మత్రిణమ్ ।

జ్యోతిష్కర్తా యదుశ్మసి॥

వం॥ మరుత్తులారా! గుహలోనున్న యీచీఁకటిని (మాకుఁగనఁబడకుండ) దాఁచివేయుఁడు. (ప్రపంచమును దినివేయు రాక్షసాదులను) చెదరఁగొట్టుఁడు. మేమే తేజస్సును గోరితిమో దానిని (అనఁగా సూర్యుని) జేయుఁడు,

---

సూ క్త ము . ౮౭.

(ఋషి - గోతముఁడు. దేవత - మరుత్తులు: ఛందస్సు - జగతి)

౮౨౭. ప్రత్వక్షసః ప్రతవసో విరప్శినో నానతా అవిథురా ఋజీషిణః ।

జుష్టతమాసో నృతమాసో అఞ్జిభి ర్వ్యానజ్రే కేచి దుస్రా ఇవ స్తృభిః॥

వం॥ శత్రువులను జెక్కివేయునట్టి, మిక్కిలి బలముకలట్టి, ధ్వనించుచున్నట్టి, యితరులకు లొంగనట్టి, ఒకరినొకరు విడువనట్టి, మూకుడు కెదుగుచూచుచున్నట్టి, (అనఁగా తృతీయ సవనములోఁ బిండివంటలు వండునపుడు మరుత్తులనే స్తుతింతురు.) లేదా-రసములనుగూడఁబెట్టునట్టి, (యజమానులచే) మిగుల సేవింపఁబడునట్టి, (మేఘాదికము) నడిపించునట్టి, మరుత్తులు తమశరీరములను గప్పియున్న యలంకారములతోఁ గొన్ని సూర్యకిరణములువలెఁ బ్రకాశించుచున్నారు.

౮౨౮. ఉపహ్వరేషు యదచిధ్వం యయింవయ ఇవ మరుతః కేనచిత్పథా ।

శ్చోతన్తి కోశా ఉపవో రథేష్వా ఘృత ముక్షతా మధువర్ణ మర్చతే॥

